# కన్నడ సాహిత్య సౌరభం

గడియారం రామకృష్ణశర్మ



# కన్నడ కవితా సౌరభం

రచన :

శ్రీ గడియారం రామకృష్ణశర్మ

ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

KANNADA KAVITA SOURABHAM

Selections from Kannada Poetry with a commentary
by Sri Gadiyaram Ramakrishna Sarma

YUVABHARATHI, SECUNDERABAD-500 003

యువభారతి

ప్రచురణ : 77

ప్రథమ ముద్రణ : డిశంబరు 1981

ప్రతులు : 1200

ముఖపత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ :

నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ :

రామా ప్రింటర్స్
హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.
లేదా
యువభారతి కార్యాలయము
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు,
తిలక్‌రోడ్ హైదరాబాదు-500 001.

వెల : రూ. 2-00




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరీవ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్ధక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదునెనిమిదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటే యితరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణా కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 76 ప్రచురణలను ప్రచురించి మూడులక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువవెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు ప్రారంభించబడిన సాహితీమిత్ర పథకంలో 7100 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతంచేశారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 725 మంది, భారతీ భూషణులుగా 70 మంది చేరారు.

ఉడుతా భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వమే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు
డిసెంబరు, 1981

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు, యువభారతి



# మనవి మాట

తన మాతృభాషలోనే కాక మరికొన్ని భాషలు నేర్చుకోవడం సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి అవసరమనే యాథార్థ్యాన్ని భారతీయులు సంభావించి చతష్షష్టికళల్లో బహుభాషాభినివేశాన్ని కూడా చేర్చినారు. ప్రాచీన కవిపండితులు పలువురు తమకు అనేక భాషల్లో ప్రావీణ్యం ఉందని సగర్వంగా, సప్రత్యయంగా ప్రకటించుకున్నారు. ప్రాచీన భరత ఖండంలో యాభైకి మించిన స్వతంత్ర రాజ్యాలున్నా, యావద్భారతీయులు సాంస్కృతికంగా తమ సమైక్య వ్యక్తిత్వాన్ని నిర్మించుకున్నారు. తమ భాషలు వేరైనా, నిత్య జీవిత రీతులు వేరైనా ఒకే భారతాత్మను తమ సాహిత్యంలో, కళల్లో సాక్షాత్కరింప జేసుకున్నారు. భారతీయ భాషల్లోని అంతస్సూత్రం ఒకటే అయినా, బాహిరంగా ఉన్న ప్రత్యేక లక్షణాల వల్ల కొన్ని భాషా కుటుంబాలుగా ఏర్పడ్డవి. తమిళం, మళయాళం, కన్నడం, తెలుగు ఇంకా మరికొన్ని దాక్షిణాత్య భాషలు ద్రవిడ భాషా కుటుంబంగా రూపొందినవి. ఈ భాషల్లోని దేశ్యపదజాలం, వ్యాకరణం దాదాపు ఒక్కటే. కొద్దిగానో, గొప్పగానో, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అన్నిటిపైనా సంస్కృతభాషా ప్రభావం ఉన్నది.

దాక్షిణాత్య భాషల్లో కన్నడ, తెలుగుభాషలు కొన్ని శతాబ్దాలనుంచి చాలా సన్నిహితంగా ఉంటున్నవి. కొంతకాలం ఈ రెంటికీ లిపి ఒక్కటే. ఇప్పటికీ ఇంచుమించు ఒక్కటే. తెలుగులో కొన్ని సాహిత్య ప్రక్రియలకూ, కొన్ని ఛందోవిన్యాసాలకూ కన్నడమే స్ఫూర్తినిచ్చింది. మన పాల్కురికి సోమనాథుడు కన్నడులకు "ఉద్దండకవి". మన శ్రీనాథుడు తనది కర్ణాట భాషాశైలి అని చమత్కారంగా చెప్పుకున్నాడు. వీరిద్దరు కన్నడులే అని ఇప్పటికీ కొందరి నమ్మకం. ఆంధ్రమహాభారత రచనకు నన్నయకు ఉజ్జ్వలంతిగా నిలిచిన కన్నడ కవి పంపడు తెలుగువాడే. తెలుగులోనూ కన్నడంలో ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించిన మనీషులు అప్పటికీ ఇప్పటికీ ఈ రెండు ప్రాంతాలలో ఉన్నారు.

ఒకే రాజవంశం ఏలుబడి కింద ఈ ఐదు ప్రాంతాల ప్రజలు జీవితయాత్ర సాగించిన సందర్భాలు అనేకం ఉన్నవి. మహబూబ్‌నగరం, మెదక్, అనంతపురం, కర్నూలు జిల్లాలలోని ప్రజల్లో పలువురికి ఈ రెండు భాషలు బాగా తెలుసు. పొలిమేరల్లోని గ్రామాల్లో ఈ రెండు భాషలు తిలతండుల న్యాయ్యంగా కలిసి కొత్త యాసనే సృష్టించినవి.

ఇక నేటి కాలంలో చిలుకూరి నారాయణరావు, రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర, బాదాల రామకవి, సుబ్బరామప్ప గడియారం రామకృష్ణశర్మ, ఆర్. వి ఎస్. సుందరం జానమద్ది హనుమచ్ఛాస్త్రి, ఎమ్. ఎస్. మహంతయ్య వంటి వారెందరో తెలుగు కన్నడ భాషల్లో తమ ప్రావీణ్యాన్ని ప్రదర్శించిన వారిలో ప్రముఖులుగా ప్రశస్తిని పొందినారు.

కన్నడ కావ్యాలలోని కొన్ని అందమైన పద్యాలను ఏరి, వాటికి తెలుగు వ్యాఖ్యానం సమకూర్చి కన్నడ కస్తూరిని తెలుగు వారికి అందించడానికి మా యువభారతికి అవకాశం కల్పించినవారు శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారు. శ్రీ శర్మ గారు సంస్కృత, ఆంధ్ర, కన్నడ ప్రాకృత భాషల్లో చక్కని అభినివేశం సంపాదించుకున్న పండితుడు. చరిత్ర పరిశోధకులు విద్వత్కవులు మా యువభారతి వేదికనుంచి పాల్కురికి సోమనాధుణ్ణి గూర్చి విద్వత్ప్రశస్తవనీయంగా ప్రసంగించిన వాగ్మివతంసులు. స్వాతంత్ర్య సమరయోధులు. ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యదర్శిగా సాహిత్యోద్యమాన్ని నిర్వహిస్తున్న సుకృతాత్ములు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ విశిష్టసభ్యులు. మా యువభారతికి చేయూతనిస్తున్న సహృదయులు, 'కన్నడ కవితా సౌరభం' మాకు వ్రాసి ఇచ్చి సహకరించిన శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారికి మా భక్తిపూర్వకాభివందనములు.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు
యువభారతి

హైదరాబాద్
4 డిశంబరు, 1981



# ముందుమాటలు

ఇప్పటికి లభించినంతవరకు కన్నడ భాషలోని మొదటి శాసనము 6వ శతాబ్దిలో వెలువడినది. మొదటి గ్రంథము 9వ శతాబ్దిలో రచింప బడినది. మొదటి కావ్యము 10 శతాబ్దిలో వ్రాయబడినది. అప్పటినుండి ఎందరో కవులు కవయిత్రులు, పండితులు, తత్త్వజ్ఞానులు, భక్తులు కన్నడ సాహిత్యమును పోషించి పరిపుష్టమొనరించినందున అది వివిధాకృతులతో విశ్వరూపమును తాల్చినది.

భారతీయ కళలన్నిటికి వలెనే కన్నడ కవితా కళకు గూడ ధర్మమే స్ఫూర్తి నిచ్చినది. జైన కవులు, శివశరణులు, బ్రాహ్మణకవులు, హరిదాసులు ధర్మప్రసారణమునే ధ్యేయముగా పెట్టుకొని రసమయ సాహిత్యమును సృష్టించినారు

మొదట 'మార్గ' పద్ధతిలో చంపువులు వెలువడినవి. 10 శతాబ్దిలోని పంపకవి మొదటి చంపూకర్త. తరువాతి కవులకు మార్గదర్శకుడు. ఈ కాలపు కవులందరును మార్గ పద్ధతిలో (వస్తువు-రీతి-ఛందస్సు సంస్కృత మర్యాద ననుసరించి) కావ్యరచన చేసినారు.

12 శతాబ్దినుండి కాల పరిస్థితులు మారినవి. బసవేశ్వరుడు పుట్టి కన్నడ సాహిత్యమును 'దేశి' పద్ధతికి త్రిప్పెను. ఆయన సామాన్యులకు వీరశైవధర్మము సులభముగా తెలియునట్లు వ్యావహారిక భాషతో 'వచనములు' రచించెను. ఇందలి భాష సరళము, కన్నడపు పలుకుబడులు పుష్కలంగా ఉండి ఇవి జన రంజకములై ఉన్నవి. వీనిని చదువుకొనవచ్చును. పాడుకొనవచ్చును. ఎందరో శివశరణులు వచనములను వ్రాసినారు.

బసవేశ్వరునిచే స్ఫూర్తి నొందిన మహాకవి హరిహరుడు. పాడుకొనుట కనువైన 'రగళ' ఛందస్సులో శివలీలలను వర్ణించెను. కావ్యమంతయు 'రగళ'లో వ్రాసిన కవి ఈతడు. ఈవిధంగా సాహిత్యమునకు కన్నడపు ముద్ర వేయబడినది.

రగళలనుండి కన్నడ సాహిత్యము సంగీతముతోకలసి పెరిగినందున తాళమునకు తగినట్లు వివిధ రూపములను దాల్చినది. అవియే షట్పది-సాంగత్య ఛందములైనవి. వీనిలో మహాకావ్యములు రచింపబడినవి.

రాఘవాంకుడు షట్పది కావ్యముకు శ్రీకారమును చుట్టెను. తరువాత కుమారవ్యాసుడు 'భారత కథామంజరి'ని రచించెను. కన్నడ సాహిత్యమునకు ఇది వసంత కాలము.

త్రిపది ఛందము ప్రాచీన మైనది. ఇది 7వ శతాబ్దినాటి శిలాశాసనమున కానవచ్చినది. ఇదియును వాడుకొనుటకు పనికివచ్చును. మన వేమన వంటి సర్వజ్ఞ కవి వలన త్రిపదులు ప్రచారము పొందినవి.

త్రిపది నుండి నాల్గుపాదముల సాంగత్యము పుట్టినది. కన్నడ జానపద సాహిత్యము సాధారణముగా త్రిపది సాంగత్య ఛందములలోనే కాన వచ్చు చున్నది. ఈ ఛందస్సులో మహాగ్రంథములు రచింపబడినవి. సంచియ హొన్నమ్మ "హదిబదెయ ధర్మ" (పతివ్రతా ధర్మములు) సాంగత్య కావ్యములలో ప్రసిద్ధమైనది.

శతకములు 11 శతాబ్దినుండి కాన వచ్చుచున్నవి. ఇవి తెలుగు శతకముల వలెనే జ్ఞాన, భక్తి, వైరాగ్య-నీతి విషయములను బోధించినవి. కన్నడ శతకములలో సోమేశ్వర శతకము సుప్రసిద్ధమైనది.

16 శతాబ్ది నుండి హరిదాసులు కీర్తనలను విరివిగా రచించిరి. శివ శరణులు తమ వచనములలో శివపారమ్యమును తెలిపినట్లే హరిదాసులు తమ కీర్తనలలో విష్ణు పారమ్యమును ద్వైత సిద్ధాంతమును ప్రచారము చేసినారు. సాహిత్య దృష్టితో చూచినను ఈ వాఙ్మయము ఉత్తమ గుణ భరితమైనది.

కావ్య సమృద్ధిలో, వస్తువైవిధ్యములో, రచనా వైశిష్ట్యములో కన్నడ సాహిత్యము మరేసాహిత్యమునకును తీసిపోదు. ఈ సాహిత్యసృష్టిలో సమాజమునందలి అన్ని సంఘముల వారు, అన్ని సంప్రదాయముల వారు భాగము వహించినారు.

కన్నడ భాషాపరిచయములేని తెలుగు వారికి కన్నడ సాహిత్యసౌరభము పంచియిచ్చు ఉద్దేశముతో నాకీ అవకాశము నొసగిన యువభారతి నిర్వాహకులకు కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

అలంపూరు

సిద్ధార్థి - కార్తీకము

గడియారం రామకృష్ణశర్మ

# విషయ సూచిక

# కన్నడ సాహిత్య సౌరభము

## 1. చంపువులు

కన్నడ సాహిత్య చరిత్రలో క్రీ. శ. 10 నుండి 12 శతాబ్ది వరకు చంపూ యుగమని చెప్పవచ్చును. ఆ యుగమున ఆదికావ్యము పంపకవి రచించిన విక్రమార్జున విజయము. అతడే తరువాతి కన్నడ కవులకు మార్గ దర్శకుడు. ఆ కాలపు ఉద్దండ కవులలో పలువురు జైనులు.

ఆ యుగమున కవులందరును సంస్కృత గ్రంథముల అనువాద కార్యములో నిరతులైయుండిరి. అన్ని విధముల సంస్కృతము నుండి సాహిత్య మర్యాదలను, ఛందస్సును, విషయములను గ్రహించిరి. వైదికములైన భారత రామాయణాది పురాణములు, జైన తీర్థంకర చరిత్రలు సంస్కృతము నుండి కన్నడభాషలో చంపూ రూపమున అవతరించినవి. ఈ విధముగ వస్తువు-రీతి రెండును సంస్కృతమయమై ఉండెను. ఆ కాలపు చంపువుల నుండి కొన్ని ఘట్టము లిచ్చట పరిచయము చేయబడుచున్నవి.

### కావ్య పద్ధతి

పంపమహాకవి కావ్య పద్ధతిని తెలుపు ఈ పద్యములు అతని ఆదిపురాణ, విక్రమార్జున విజయ (పంపభారత)ముల నుండి గ్రహింపబడినవి. అతనికాలము పదియవ శతాబ్ది.

కం॥ మృదుపద గతియిం, రసభా
వద పెర్చిం, పణ్యావనితె వోల్ కృతి సౌంద
ర్యద చాతుర్యద కణి యెనె
విదగ్ధ బుధజనద మనమ నళియతె వేడా॥

మృదువృత్తైన పదముల గమనముచేతను, రసభావముల ఆధిక్యము చేతను కావ్యము వేశ్యాంగనవలె సౌందర్యమునకు, చాతుర్యమునకు గనియై పండితులు విజ్ఞులు అయిన జనుల మనస్సును ఓలలాడింపవలదా.

కావ్యమును వేశ్యాంగనతో పోల్చినాడు పంపమహాకవి. మృదు పదగతి రసభావాధిక్యము ఉభయులకును అవసరము. రెండును సౌందర్య చాతుర్యములకు గనులే.

కం॥ కవితా రహస్యమం, స
త్కవి యఱిగు, మనేక మూక నేడం జడనెం
బవ నఱిగుమె, విట నఱిగుం
కువిటం స్త్రీరత రహస్య దొళు గఱిదపనే॥ 2

కవితా రహస్యమును సత్కవి మాత్రమే ఎరుగును. సామాన్యుడు - మూగ - చెవిటి - జడుడు ఎరుగునా ? స్త్రీ రతి రహస్య విలాసములను విటుడే ఎరుగును. కువిటుడు తెలిసికొనునా ?

కం॥ భాషావిదర్, కవిత్వ వి
శేషజ్ఞర్, నికష రప్పొ డప్పుదు సభెయొళ్
మాషముఖరంతె దోషగ
వేషణపర రప్ప రెందొడదు తెగళత్తే॥ 3

భాషా మర్మమును తెలిసికొన్నవారు, కవితా విశేషముల నెరిగినవారు సభలలో పరీక్షకులై యుండుట మంచిది. అట్లుకాక మూఢ ప్రముఖులట్లు ఇతరుల దోషములను వెదకుట యందే ఆసక్తిగలవారు పరీక్షకులైనచో అది నిందాస్పదము కాదా ?

కం॥ కివియిం బగె వుగువొడె, కొం
కు వెత్త పొస నుడియె పుగుగు ముళిదుదు సరుసై
తవ చరనెమాడి సరుసై
తు పోకుమేం బగెయ బట్టియం ముట్టుగుమే॥ 4



చెవినుండి మనస్సులోనికి ప్రవేశింపవలెనన్నచో వ్యంగ్యముతో కూడిన క్రొత్త మాటలకే సాధ్యము. తక్కిన వాచ్యములైన పాత మాటలు చెవివరకు వచ్చి విసుగెత్తించి వెళ్ళిపోవును. అవి మనస్సు దాఁ మెట్టగలవా ?

కవులు సామాన్యములైన మాటల నుపయోగించినచో ఉదాత్త భావములు శ్రోతల మనస్సుల కెక్కవు. వ్యంగ్యములగు పలుకులైన శ్రోతల మనస్సుల కెక్కగలవు.

కం॥ ఇరు మరుళే శుష్కవైయా
కరణంగం, శుష్కతార్కికంగం, బెళ్ళ
క్కరి గంగం, విషయమె కా
వ్యరత్న మతిచతుర కవికదంబక విషయం॥ 5

బుద్ధిహీనుడా ! ఊరక ఉండుము. అతి చతురులైన కవిసమూహము నకు అర్హమైన కావ్యరత్నము, వట్టి వ్యాకరణ పండితునకు, తార్కికునకు, నిరక్షరునకు ధారణ యోగ్యమగునా ?

పూర్వము ప్రాచీన పద్ధతిలో శాస్త్రములను కంఠస్థము చేయించుచుండిరి. అక్షర జ్ఞానము లేనివారికిని వ్యాకరణ సూత్రములు, తర్క సూత్రములు నేర్పుచుండిరి. వారు ఆయా శాస్త్రములలో విద్వాంసులగుచుండిరి. కాని సాహిత్యాభ్యాసమునకు అది సరిపోదు. దానికి అక్షరజ్ఞాన మవసరము. చదువను, వ్రాయను నేర్చి, కావ్యశ్లోకములను వ్రాసికొని నేర్చుకోవలసి యుండును. అదియుగాక కేవల తర్క వ్యాకరణములు నేర్చినవారు శుష్క హృదయులై యుందురు. సాహిత్య మర్మము లెరిగినవారే రసహృదయు లగుదురు. అట్టివారికే కావ్యరత్నము గ్రహింప యోగ్యమగును. పంపకవి ఆనాటి సభాపండితులను అవహేళన చేసినాడు.

చం॥ బగెపొస తప్పు, దాగి మృదుబంధ దొళొందువు, దొందు దేసియొళ్
పుగువుదు, పొక్కమార్గదొళె తళ్వుదు, తళ్తొడె కావ్యమొ
ప్పుగు మెళెమావు కెందళిర పూవిన బిణ్ పొరయింబళల్దు తుం
బిగళినె తుంబి కోగిలెయె బగ్గిసె సుగ్గియొ ళొప్పువంతెవోల్॥

ఆలోచించు మనస్సు క్రొత్తది కావలెను. క్రొత్తదై మృదువుగా ఉండవలెను. అట్లుండి దేసి పద్ధతిలో జొరబడవలెను. త్రొక్కినదారిలోనే (దేసిలోనే) స్థిరముగ నిలువవలెను. నిల్చినచో కావ్యబంధము లేతమామిడిచెట్టు వసంత కాలమున కెంజిగురులతో, పూలగుత్తుల భారముతో వికసించి తుమ్మెదలు నిండికొన, కోయిలలు కూయుచుండ ఒప్పారుచున్నట్లు ఒప్పుచుండగలదు.

వసంతకాలములో గున్నమామిడి ఏ విధముగా ఎర్రని చిగుళ్ళతో పూలగుత్తులతో, తుమ్మెదలు ముసురుకొనగా, కొమ్మలపై కూర్చుండిన కోయిలలు కూయుచుండగా చూడముచ్చటగ నుండునో అట్లే మహాకావ్యము క్రొత్త మనస్సు నుండి వెలువడిన మధురోహలతో, శ్రావ్యములు మృదువులు అయిన పదములతో, చక్కని దేసి పద్ధతులతో కూడి ఉన్నపుడు ప్రకాశించుచుండగలదు. అనగా కవికి ఉదాత్త భావనలు చేయుటకు క్రొత్త మనస్సు కావలెను. ఆ మధుర భావములను వెల్లడించుటకు మృదు పదములు దేశి పద్ధతి అవసరమనిచెప్పబడినది.

చం॥ లలితపదం ప్రసన్న కవితాగుణ మిల్లదె, పూణ్దు పేళ్ద బె
ళ్గళ కృతిబంధముం, బరెవ కారర కైగళ కేడు, నుణ్ణన
ప్పళకద కేడు, పేళిసిదొ డర్థద కేడు, పేళ్దు బీగి పొ
ట్టళిసి నెగత్తె గాటిసువ దుష్కవియుం కవియెంబలెక్కయే॥

లలితములైన పదములు, ప్రసన్న కవితాగుణము లేకుండ పూనుకొని రచించిన బుద్ధిహీనుల కావ్యము వ్రాసినవారి చేతుల దండుగ, నున్నని తాటియాకుల దండుగ, వ్రాయించినవారి డబ్బు దండుగ అన్నట్లుండును. అట్టి దానిని రచించి విఱ్ఱవీగుచు ఉబ్బిపోయి కీర్తికి ఉవ్విళ్ళూరుచుండు దుష్కవి గూడ కవిగా లెక్కకు వచ్చునా ?

పంపకవి తరువాత తెలుగు భారతమును ఆరంభించిన నన్నయభట్టు ఇందలి లలితపదం, ప్రసన్న కవితా గుణములతోబాటు ప్రసన్న కథా కథనమును చెప్పినాడు. అది పంపనిలో లేదు.

విదితం, ప్రాతీతికం, కోమల, మతి సుభగం. సుందరం
సూక్తిగర్భం,
మృదు సందర్భం, విచారక్షమ, ముచితపదం. శ్రవ్య,
మవ్యాకుళం, వ్యా
ప్తదిగంతం, కావ్యమెం దన్వీత సుకవిజనం మెచ్చి నిచ్చం
మనం గో
ళ్పదరిందం, నెట్టనీతం సుకవిజనమనో మానసో త్తంస
హంసం॥ 8

కావ్యము బాగా తెలియునది, ఖ్యాతి పొందినది, కోమలమైనది, మంగళమైనది. సుందరమైనది, సూక్తులతో నిండినది, మృదువైన కథా సందర్భములుగలది, ఆలోచింపదగినది, పదౌచిత్యముగలది, శ్రావ్యమైనది, ఆనందకరమైనది, దిగంత వ్యాప్తికలట్టిది అని అవగాహన మొనరించి కొన్న సుకవిజనులు మెచ్చునట్లు నిత్యమూ మనస్సును అలరించుటవలన ఈతడు (పంపకవి) సుకవిజనుల మనస్సు అను మానస సరోవరమునకు శిరో భూషణమైన హంస అయినాడు.

పంపకవికి 'సుకవిజన మనోమాన సోత్తంస హంస', కవితాగుణార్ణవ సరస్వతీ మణిహార, సంసార సారోదయ' బిరుదములున్నవి. ఒక బిరుదును పై పద్యమున గర్వముతో చెప్పినాడు.

(పంపకవి పూర్వులు వేంగి దేశమువారు. తండ్రి జైనధర్మము నవలంబించి కన్నడదేశమునకు పోయెను. ఈ కవి వనవాసి ప్రాంతమున జన్మించెను. తెలంగాణము నందలి వేములవాడ రాజధానిగా నేలిన చాళుక్య అరికేసరి ఆస్థానమున కవిగా, సేనాపతిగ ఉండెను. ఆదిపురాణ, విక్రమార్జున విజయములను రచించెను. కరీంనగరం జిల్లా ధర్మపురి అగ్రహారమును సంపాదించి అందు వసించెను. చివరకు సన్యసించి నిజామాబాదుజిల్లా బోధన్‌లో నిర్యాణము చెందెను. ఈయన సమాధి బోధన్‌లో బయలుపడినది.)

# భీమసేన ప్రతిజ్ఞ

(కన్నడ రత్నత్రయములో పంప-పొన్నకవుల తరువాతివాడు రన్నకవి. అతడు పదియవ శతాబ్ది చివర కల్యాణి చాళుక్య చక్రవర్తి ఇరివబెడంగ సత్యాశ్రయుని ఆస్థానమున నుండి "సాహస భీమసేన విజయ" (గదాయుద్ధ) కావ్యమును రచించెను. ఇతడును నన్నయభట్టునకు పూర్వుడే. ఆ కావ్యమునుండి ఈ ఘట్టము గ్రహింపబడినది.)

మం॥ కురుభూభృత్ బలతూల కాల పవనం. కౌరవ్యగంధేభకే
సరి, దుశ్శాసన రక్తరక్తవదనం, దుర్యోధనోరుక్షమా
ధరవజ్రం, కురురాజ రత్న మకుటోత్కూటాంఘ్రిసంఘట్ట సం
గర, నెందెం దభివర్ణి పెం రణయశః శ్రీరామనం, భీమనం 1

కౌరవరాజ సైన్యము అను తూలరాసిక ప్రళయకాల పవనుడు, దుర్యోధనుడను మత్తేభమునకు కేసరివంటివాడు, దుశ్శాసనుని రక్తము త్రావుటవలన ఎర్రనైన వదనము గలవాడు, దుర్యోధనుని ఊరువులను పర్వతములకు వజ్రమైనవాడు, కురురాజు రత్నకిరీట శృంగమును పాదముతో త్రొక్కు ప్రతిజ్ఞ కలవాడు, రణయశోలక్ష్మికి మనోహరుడు అయిన భీమసేనుని మాటి మాటికి అభివర్ణించెదను.

వచనము—ఆ ప్రస్తావదొళ్ - పాంచాలరాజ తనూజె పవమాన తనూజనల్లిగె వందు. 2

పై విధముగ వృద్ధ కంచుకి భీముని వర్ణించుచుండ; ద్రౌపది భీమసేనుని దగ్గరకు వచ్చి.

చం॥ దనుజవిరోధి మాడిదొడ మాగదె సంధి దలెన్ననిన్న సై
పినొ శవశిష్ట కేవళ సుయోధన మాయ్తరిసేనె సింధునం
దన ధృతరాష్ట్రి రిర్దొ రెమె నమ్మరసం మరుద్ధింబు కెయ్గుమెం
దకళయ మూను దిందెనగె సుళ యమం కళే కౌరవాంతకా!

దనుజ విరోధియగు శ్రీకృష్ణుడే చేయ బూనినను సంధి విఫలమైనది. ఇది నిశ్చయముగ నీవూ, నేను చేసికొన్న పుణ్యముల ఫలము. ఇప్పుడు శత్రు సైన్యములో సుయోధను డొక్కడే మిగిలినాడు. భీష్మ ధృతరాష్ట్రులు కలసి చెప్పినచో మన మహారాజు మరల సంధికి అంగీకరించునేమో అని నా మనస్సు వ్యథనొందుచున్నది. కౌరవాంతకా నా సంశయమును పోగొట్టుము.

శ్రీకృష్ణు నంతవాడు సంధిచేయ ప్రయత్నించినను మన పూర్వ పుణ్య ఫలమువలన సంధి తప్పుటే కాక శత్రు సైన్యము దుర్యోధనుడు తప్ప అంతయు నాశనమైనది. అయినప్పటికిని ద్రౌపదికి సంధిభయము పోలేదు. ఇంత జరిగినను భీష్ముడు, ధృతరాష్ట్రుడు గట్టిగా బోధించిన యెడల ధర్మరాజు మెత్త బడి సంధికి అంగీకరించునేమో అని ఆమె సందేహము. అట్లు జరుగకుండ చేసి తన దుఃఖమును పోకార్చుము అని ద్రౌపది భీముని కోరుచున్నది. ఈ పద్య మున ప్రయోగించబడిన ధనుజవిరోధి - కౌరవాంతకా అను విశేషణములు గంభీరార్థ స్ఫోరకములు.

కం॥ ఖల దుశ్శాసన వక్షః
స్థలోచ్చలత్ కృష్ణరక్త జలాదిం కోపా
నలశమం మళ్గిసి నీ వం
గళా ! గళిత కోపనిర్భ తెరదిం దిర్దయ్॥ 4

దుష్టుడయిన దుశ్శాసనుని వక్షస్థలమునందు పైకి ఎగయుచున్న నల్లని రక్తము అను జలముచే కోపాగ్ని చల్లారగా నీవు జారిపోయిన కోపము గల వానివలె ఉన్నావు.

భీముని ప్రతిజ్ఞలు రెండు. దుశ్శాసనుని చంపి వాని రక్తము త్రావుట, దుర్యోధనుని తొడలు విరిచి వాని కిరీటమును తన్నుట. ఇందులో మొదటిది నెరవేరినది. రెండవది జరుగలేదు. ముఖ్యశత్రువు బ్రతికి ఉండగా భీముని కోపాగ్ని చల్లారకూడదని ద్రౌపది అభిప్రాయము.

క౦॥ సమవాయ మహితరోళ్ సం
భిమాడి యమసూనుపేళె వనవాసవె దల్
నిమగె శర ణెన గమం ద
గ్నిముఖదె పుట్టి దుదటిందె శరణగ్నిముఖం॥ 5

శత్రువులతో సంధియా? ధర్మరాజు మెత్తబడి సంధికి ఒగ్గినచో వనములో పుట్టిన మీకు వనమే శరణ్యమగును. నేను అగ్నితో పుట్టినదానను కాన నాకు అదియే శరణ్యము కాగలదు.

ఒకవేళ ధర్మరాజు కులవృద్ధులైన భీష్మాదుల మాటలకు దాక్షిణ్యముతో మీరలేక ఇంత నాశనము జరిగిన తరువాత గూడ సంధి చేసికొన్నచో మరల అరణ్యమే గతి కావలసివచ్చునని ద్రౌపది తలచి తన నిశ్చయమును తెలుపు చున్నది. పాండురాజు కుంతీ మాద్రులతో అరణ్యమందున్నపుడు పాండవులు పుట్టినారు. కావున వారికి అరణ్యమే శరణ్యము కాగలదు. అట్లే తాను అగ్ని కుండముతో పుట్టినది కావున తనకు అగ్నియే శరణ్యమగును. అనగా ఈ సారి మీవెంట అడవులకు రానని పరాభవమును సహింపలేక అగ్నిలో పడి చచ్చెద నని ఖండితముగా చెప్పుచున్నది.

వచనము — ఎందు నొందు నుడియె మరున్నందనం దరహసిత వదనార వింద నాగి తన్నంతర్గత దోళ్॥

ద్రౌపది ఈ విధముగ నొచ్చి పలుక భీమసేనుడు చిరునగవు మొగమున దోప తన మనమున నిట్లనుకొనెను.

క౦॥ కురురాజానుజ భీకర
కరవిలులిత నీలకబరి భరమం పిడిదుం
పరిభవిసల్ కృష్ణగె మిగె
దొరకొళిసదె కోపముం మనస్తాపముమం॥ 7

దుశ్శాసనుడు భయంకరములైన కరములచే చెదరిన కొప్పు బట్టి ఈడ్చి పరాభవింపగా ద్రౌపదికి కోపమును మనస్తాపమును కలుగుట సహజము కదా!

కం॥ ధాత్రియుమ సిహాలతాళన
పుత్రియుమం బఱుదె సోత్తు నల్లం జూదిం
క్షత్రియ తేజముమం యమ
పుత్రం రిపుగందె సోల్తు నాగలె వేడా॥ 8

ధర్మరాజు జూదములో రాజ్యమును, హాతాళన పుత్రి అయిన ద్రౌపదినే కాక అప్పుడు తన క్షాత్ర తేజమును గూడ ఓడి శత్రువునకు అప్పగించి యుండును.

ధర్మరాజు జూదములో తన క్షత్రియ తేజస్సునే ఒడ్డి ఓడిపోయి శత్రుని పాలుచేసి యుండవచ్చును. లేనిచో తన ధర్మపత్నిని నిండుసభలో శత్రువులు పరాభవించి అవహేళన చేయుచుండగా సహించుచు మౌనము వహించి యుండునా అని భీముని సందేహము.

కం॥ పరవశరో శిద్దరో మేణ్
పరార్జిత ప్రాణరాదరో ద్రౌపది యుం
పరిభవిసు వల్లినోడు
త్తిర లక్కుమె పవనసూనుగం పార్థంగం॥ 9

భీమార్జునులు పరవశులై ఉండిరో, లేక పరాధీన ప్రాణులైరో, కాకున్న ద్రౌపదిని పరాభవించుచుండగా ఊరక చూచుచుండుట జరుగునా ?

కం॥ వినయమనె బగెదు విక్రమ
మనె బగెయవె నరను మానుం ఎనగం సంమో
హన మాదు దక్కుమం ద
ణ్ణన సూనృతవచన మెంబ మంత్రాతురదిం॥ 10

నేను-అర్జునుడు వినయమునే ఆలోచించితిమి కాని విక్రమమును ఆలోచింపకపోతిమి. నన్నుగూడ అన్నగారి సూనృత వచనము అను మంత్రాక్షరములు సంమోహితుని చేసినవి.

అన్నగారి ఆజ్ఞా బద్ధులగుట వినయము. భార్య నవమానించిన వానిని చంపుట విక్రమము. అన్నగారి మాటకు ఎట్టి విపరీత సమయములోనైన అర్జునుడు వినయము చూపవచ్చును. కాని ద్రౌపదికి పరమప్రియుడైన తాను గూడ ఆ స్థితిలో వి కమించుట మరచి అన్నగారి మాటకు వివశుడనైతినే అని భీముడు చింతించుచున్నాడు.

వచనము—ఎందు పశ్చాత్తాపం గెయ్యు కురుకుల విళయజ్వాలె సుయోధన ప్రళయకాలె పాంచాలియ వదనమంనోడి—అని పశ్చాత్తాపము నొందుచు కురుకులమునకు విలయాగ్నిజ్వాలయు, సుయోధనునకు వినాశకాలము అయిన పాంచాలి మొగము చూచి-

క ॥ గళి సుతిరె కబరి భరం
గళి ముసుతి నయనవారి నిన్నాననదిం
నళినాననె నీనిరె కురు
కులాంతకం గళితకోపనే ఈ భీమం॥ 12

ఓ సుందరీ! వెంట్రుకలు విరబోసికొని, కన్నులలో నీరు కార్చుచు ఈ స్థితిలో నీవుండగా కురుకులమునకు యముడైన ఈభీముని కోపాగ్ని చల్లారునా?

కబరీబంధము జారగా, కన్నీరు కారగా మూర్తీభవించిన శోకదేవతవలె ఉన్న ద్రౌపది ఆకారము భీముని కోపాగ్నిని చల్లారిపోనీదు. దుర్యోధనుని చంపి నీ శిరోజములను ముడివేసి కన్నీరు తుడువనిదే నా కోపము తీరదు అనుచున్నాడు.

కం॥ నీనగ్నిపుత్రియయ్, పవ
మాన తనూభవనె నా నణంకూడిరె సం
ధాన మరి నృపరొళెం తన
లానిల సంయోగ మురివ దిర్కెమె పగెయం॥ 13

— నీవు అగ్నిపుత్రికవు. నేను వాయునందనుడను. మనము కలసియుండగా శత్రువుతో సంధి జరుగునా? అగ్నివాయు సంయోగము ఎంతటి పగనైన భస్మము చేయకుండునా?

# 2. వచనములు

(12 శతాబ్ది నుండి కన్నడ సాహిత్య చరిత్రలో స్వాతంత్ర్య యుగము ప్రారంభమైనది. అంతవరకు జైన కవులును, ఇతరులును సంస్కృత మార్గమున గ్రంథరచన చేయుచుండిరి. 1160 క్రీ శ ప్రాంతమున బసవేశ్వరుడు అవతరించి కన్నడ సాహిత్యమును క్రొత్తదారికి మళ్ళించెను ఆయన, అనుచరులు ధర్మప్రచారము నుద్దేశించిరి కాని కావ్యరచనలను కాదు. సామాన్య జనులకును ధర్మబోధ సులభముగ తెలియవలెనని వారు వచనములు అను నూతన ప్రక్రియలో రచనలు చేసిరి ఇట్టి వచనములు సుందరములై మనోరంజకములై సాహిత్యము నందొక స్థానమును పొందినవి.

బసవన ధార్మిక మహా విప్లవోద్యమమును నిర్వహించిన మహాపురుషుడు ఆయన ప్రచారము చేసిన ధర్మమును వీరశైవ మనెదరు. ఆనాటి వైదిక సమాజములోని అత్యాచారములను, అక్రమములను తీవ్రముగ ఖండించెను. ఆయన అనుచరులైన శివశరణులు తమ వచనములలో కర్మఠుల దురాచారములను నిరసించి భక్తిని బోధించిరి.

## బసవన వచనములు

నీరకండల్లి ముళుగువరయ్యా
మరన కండల్లి సుత్తువరయ్యా
బత్తువ జలవ నొణగువ మరన
మెచ్చి దవరు నిమ్మనెత్త బల్లరు
కూడల సంగమదేవా॥ 1

నీళ్ళు కంటబడిన మునిగెదరు చెట్టు కనబడిన ప్రదక్షిణలు చేసెదరు. ఇంకిపోవు నీళ్ళను, ఎండిపోవు చెట్టును, మెచ్చువారు-మిమ్ము నెక్కడ తెలిసి కొందురు? కూడల సంగమేశ్వరా!

సాధారణముగా ఆచార పరాయణులైనవారు నదులకు, పుష్కరిణులకు, సముద్రాలకు వెళ్ళి శ్రద్ధతో స్నానములు చేయుచుందురు. అశ్వత్థ బిల్వాది వృక్షములకు తులసికి ప్రదక్షిణలు చేయుదురు. కాని నిశ్చలమైన మనస్సుతో ఉన్నచోటనే భగవంతుని ధ్యానింపలేరు. శివుని ధ్యానించుటకు ఏకాగ్రత అవసరము. నీట మునుగుటకు, ప్రదక్షిణలకు అది అక్కరలేదు. ఎంత చాపల్యముతోనైన వాటిని చేయవచ్చును.

కిచ్చుదైవ వెందు హావియ నిక్కువ
హారువన మనెయెల్లి కిచ్చెద్దు సుడువాగ
బచ్చల నీర బీదియధూళ హొయ్యు
బొబ్బిట్టెలర కరెవరయ్యా! కూడల సంగమదేవా॥ 2

అగ్నిని దైవముని నమ్మి భక్తితో ఆహుతులను సమర్పించు బ్రాహ్మణుని ఇంటిలో మంటలులేచి వస్తువులను కాల్చునపుడు అతనికి ఆ భక్తిపోయి అగ్ని నార్పుటకు హడావుడితో స్నానగృహములోని నీరో, బజారుదుమ్మో చల్లుచు కేకలువేయుచు రక్షించుడని అందరిని అర్థించును గదయ్యా కూడల సంగమేశ్వరా!

నిత్యాగ్ని హోత్రులైన కర్మఠులు ప్రతిదినము ప్రాతరౌపాసనము శ్రద్ధతో చేయుచుందురు. ఆహుతుల వలన అగ్ని ప్రజ్వలించి అజాగ్రతవలన ఇల్లు తగులబడుట తటస్థించినచో శ్రద్ధా భక్తులు నిలుచునా? ఆదుర్దాతో అగ్ని నార్పుటకు బచ్చలింటి నీటినో, బజారు దుమ్మునో చల్లెదరు. సహాయమునకై గగ్గోలు చేయుదురు. అగ్నియందు నిశ్చయముగ దైవ భావన ఉన్నచో అగ్ని రక్షింపదా? కర్మానుసారముగ ఇల్లు కాలిపోయినను జ్ఞాని ఆందోళన చెందడు. లోకాచారము కొరకు హోమము చేయుచు స్థిరబుద్ధి లేకుండువారిని బసవన హేళన చేయుచున్నాడు.

దయవిల్లద ధర్మ వావుదయ్యా
దయవే బేకు సకల ప్రాణిగళెల్లరల్లియూ
దయవే ధర్మద మూలవయ్యా
కూడల సంగమదేవా!! 3

దయలేని ధర్మ మెట్టిది ? అన్ని ప్రాణుల మీద దయయే ఉండవలెను. దయయే ధర్మమునకు మూలము సంగమేశ్వరా !

మానవునకు దయాగుణ మొక్కటే ధర్మసార సర్వస్వము. దయ లేకుండ ఎన్ని ధర్మము లాచరించినను దైవము మెచ్చడు. సకల ప్రాణులలో భగవంతుడు అంతర్యామిగా ఉన్నాడు. కర్మఠులు స్వర్గ సుఖముల నాసించి పశుహింస చేసి యజ్ఞాదులు చేయుచుందురు. అట్టివారిని బసవన నిరసించెను. హింస వ్యర్థమని చెప్పెను.

దేవలోక మర్త్యలోక వెంబుదు బేరిల్ల కాణిరో
సత్యవనుడివుదే దేవలోక. మిథ్యవ నుడివుదే మర్త్యలోక
ఆచారవే స్వర్గ అనాచారవే నరక
కూడల సంగమదేవా నీనే ప్రమాణ॥ 4

దేవలోకము, మానవలోకము అనునవి వేరువేరుగా లేవు సత్యము చెప్పుటే దేవలోకము. అసత్యమాడుటే మానవలోకము. సత్ప్రవర్తనమే స్వర్గము. దుష్ప్రవర్తనమే నరకము. సంగమేశ్వరా ఇందుకు నీవే ప్రమాణము.

మూఢాచార పరాయణులు స్వర్గ నరకములు. ఎక్కడనో ఉన్నవని నమ్ముచు తమ ప్రవర్తన లెట్లున్నను ఆయా కర్మలు చేయుటవలన స్వర్గ సుఖములు లభించునని భ్రాంతి చెందెదరు. వివేకవంతులు సత్యము గుర్తెరిగి సత్ప్రవర్తనులై దైవమును నమ్మి సుఖ శాంతులను పొందెదరు.

కల్లనాగన కండరె హాల నెరెయెంబరు
దిట్టనాగన కండరె కొల్లెంబరయ్యా
ఉంబ జంగమ బందరె నడెయెంబరు
ఉణ్ణద లింగక్కె బోనవ హిడి యెంబరయ్యా
కూడల సంగమదేవా ! 5

నాగ విగ్రహములు కనబడిన పాలు పోయుమందురు. నిజమైన నాగములు కనబడిన చంపుమందురు. పెట్టినది తిను జంగము వచ్చిన 'పో' అందురు. తినని లింగమునకు నైవేద్యము పెట్టెదరు. సంగమేశ్వరా !

మూఢాచారుల విపరీత వర్తనము వెక్కిరింపబడినది. రాతిపై చెక్కిన నాగమూర్తులకు భక్తితో పాలుపోయుట, నిజమైన నాగులు కనబడినభయముతో చంపించుట విపరీత విషయము. అట్టి వారికి భక్తిలేదు. కేవల పరంపరాగత మైన ఆచారముతో ఆ పనిచేయుచున్నారు. ఆకలిగొని భక్తుడు వచ్చిన లుబ్ధత్వముతో పొమ్మనుట, ఏమీ తినని శిలాలింగమునకు పంచభక్ష్య పర మాన్నములు నైవేద్యము పెట్టుట గూడ వ్యర్థమే.

హుత్తవ బడిదరె హావు సాయబల్లుదె అయ్యా, అఘోర
తపవ మాడిదడేను? అంతరంగ ఆత్మశుద్ధ విల్లదవర
నెంతు నంబువనయ్యా కూడల సంగమదేవా! 6

పుట్టపై కొట్టినచో పాము చచ్చునా? భయంకర తపము చేసిననేమి? అంతరంగ ఆత్మశుద్ధి లేనివాని నెట్లు నమ్మవలెను సంగమేశ్వరా!

ఆత్మశుద్ధిచేతనే దేవుని లోగొనవచ్చును. కాని బహిరాడంబరములచేత కాదు. తనలో ఉన్న అహంకారాదులను చంపవలెను కాని, జపతపాదులచే ఆత్మ శుద్ధి కలుగదు. పుట్టమీద ఎంత కొట్టినను పాముచావదు. అందలి పామును చంపుటకు చాల ప్రయత్నము కావలెను. అట్లే అంతరంగశుద్ధికి మహాసాధన అవసరము.

కళబేడ, కొలబేడ. హుసియ నుడియలు బేడ,
మునియబేడ, అన్యరిగె అసహ్యాపడ బేడ తన్న బణ్ణిసబేడ,
ఇదిర హళియలి బేడ, ఇదే అంతరంగశుద్ధి. ఇదే బహిరంగశుద్ధి
ఇదే నమ్మకూడల సంగమ నొలిసువ పరి॥ 7

దొంగిలింపవద్దు, చంపవద్దు, అసత్యమాడవద్దు, కోపపడవద్దు, ఇతరులకు అసహ్యాపడవద్దు, నిన్ను పొగడుకొనవద్దు, పరుల దూషింపవద్దు, ఇదే బహిరంగశుద్ధి, ఇదే సంగమేశ్వరుని మెప్పించు గుణము.

దొంగతనము, క్రౌర్యము, అసత్యము, క్రోధము. ఆత్మస్తుతి, పరనింద ఈ అవగుణములను వదలినవాడే బహిరంతశ్శుద్ధులు గలవాడు. అట్టివాడే శివునకు ఇష్టుడు.

ఉళ్ళవరు శివాలయ మాడువరు
నానేను మాడువె బడవనయ్యా
ఎన్న కాలే కంభ దేహవే దేగుల
శిరహొన్న కళసవయ్యా, కూడల సంగమదేవా॥ 8

ధనము కలవారు శివాలయమును కట్టించెదరు. నిరుపేదను నేనేమి కట్టింతును. నాకాలే స్తంభము, నా దేహమే దేవాలయము. నా తలయే స్వర్ణ కలశము. సంగమేశ్వరా !

భగవంతుని స్వరూపమును తెలిసికొనలేని ధనవంతులు గుళ్ళు కట్టింతురు. విశ్వవ్యాపి అయిన భగవంతునకు భక్తుని పవిత్రదేహమే ఆలయము. "దేహో దేవాలయః ప్రోక్తః, జీవో దేవః సనాతనః" అన్న ఉపనిషద్ వాక్యమును బసవన్న తేటమాటలతో చెప్పినాడు.

చంద్రోదయక్కె అంబుధి హెచ్చుదవుయ్యా
చంద్రకుందె కుందువుదయ్యా
చంద్రంగె రాహు అడ్డబందల్లి అంబుధి బొబ్బిట్టిత్తె అయ్యా
అంబుధియ ముని ఆపోషణ కొంబల్లి చంద్రమ నడ్డబందనె అయ్యా
అరిగారూ ఇల్ల కెట్టవంగె కెళెయుల్ల
జగద నెంట నీనే అయ్యా కూడల సంగమదేవా! 9

చంద్రుడుదయించిన సముద్రము పొంగును. చంద్రుడు అస్తమించిన అంబుధి క్రుంగును. ఆ చంద్రునే రాహువు మ్రింగిన సముద్రము కేకలు వేయునా? సముద్రమును అగస్త్యుడు ఆపోశనము పట్టినపుడు చంద్రుడు వారించెనా? ఎవరికెవరును లేరు. చెడినవానికి మిత్రులులేరు. ప్రపంచమునకు బంధుడవు నీవే సంగమేశ్వరా ?

చంద్రునకు సముద్రమునకు ప్రాకృతిక సంబంధమున్నది. చంద్రోదయమునకు సముద్రము పొంగుట, అస్తమించుటకు క్రుంగుట సహజములు.

అయినప్పటికిని చంద్రుడు రాహుగ్రస్తుడైనపుడు సముద్రము తోడ్పడలేదు. సంద్రమును అగస్త్యుడు ఆపోశనము పట్టినపుడు (త్రావినపుడు) చంద్రుడు అడ్డు పడలేదు. బాగున్నపుడు ఒకరికొకరు మిత్రులు కష్టకాలము వచ్చినపుడు ఎవరికి ఎవరును తోడ్పడరు. దైవమొక్కడే కష్టములలో తోడ్పడు బంధువు.

ఒలె హత్తి యురిదొడె నిలబహుదల్లదె
నెలె హత్తి యురిదొడె నిలలు బహుదె
ఏరి నీరుంబొడె, బేలి కెయ్య మేవొడె
నారి తన్నమనె యల్లి కళువొడె
తాయ మొలెవాలు నంజాగి కొలువొడె
ఇన్నారిగె దూరువెనయ్య కూడల సంగమదేవా! 10

ప్రొయ్యి అంటుకొని మండుచున్నచో అది ఆరిపోవచ్చును. నేలయే అంటుకొని మండ దొడగిన ఆరిపోగలదా? చెరువుకట్టయే అందలి నీటిని త్రావిన, కంచెయే చేనుమేసిన, ఇల్లాలు తన ఇంటనే దొంగతనము చేసిన, తల్లి చనుబాలే విషమై చంపిన ఇంకెవరిని దూషింతునయ్యా! సంగమయ్యా!

దైవసృష్టియే విపరీతమై మానవుని ఆపదలకు కారణమైనచో ఇతరులను దూషించుట వ్యర్థము. దైవమే అనుగ్రహింపవలెను.

---

"చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది"

[illegible]



# అక్కమహాదేవి వచనములు

హసివాదరె ఊరొళగె భిక్షాన్నవుంటు
తృషెయాదరె కెరె భావి హళ్ళంగళుంటు
శయనక్కె హాళు దేగుల వుంటు
చెన్నమల్లికార్జునయ్య ఆత్మసంగాతక్కె నీనెనగుంటు 1

ఆకలి అయినచో ఊరిలో భిక్షాన్నమున్నది. దప్పి అయినచో చెరువులు, బావులు, కుంటలున్నవి, పండుకోవలెనన్న పాడుగుడులున్నవి. ఆత్మసాహచర్యమునకు నీవున్నావు చెన్నమల్లికార్జునస్వామీ॥

అక్కమహాదేవి మహాభక్తురాలు. బసవనకు సమకాలికురాలు. శ్రీశైల మల్లికార్జునస్వామినే పతిగా భావించి తరించినది. ఆమెకుగల దృఢవైరాగ్యము పైవచనములో స్పష్టముచేయబడినది.

ఎన్న మాయద మదవ మురియయ్య
ఎన్న కాయద కత్తలెయ కళెయయ్య
ఎన్న జీవద జంజడవ మాణిసయ్య
ఎన్న దేవ చెన్నమల్లికార్జున దేవయ్య
ఎన్నసుత్తిద ప్రపంచవ బిడిసు నిమ్మధర్మ ॥ 2

ఓ మల్లికార్జునదేవా! నా భ్రాంతి అహంకారములను త్రుంచుము. నా శరీర క్లేశమును తొలగించుము. నా జీవుని ఝంఝాటము మాన్పుము. నన్ను ఆవరించిన ప్రపంచమును వదలింపుము. నీదే భారము.

మానవుడు ముక్తిపొందుటకు సకల వ్యామోహములనుండి దూరము కావలెను. జీవితమునకు సంబంధించిన అన్ని సంసారబంధములు తొలగవలెను. అందుకు దైవానుగ్రహమే కారణము- అది భక్తితోడనే సాధ్యమగును.

హిండనగలి హిడి వడెద కుంజర
తన్న వింధ్యవ నెనెవంతె నెనెవెనయ్యా
బంధనక్కెబంద గిళితన్న బంధువ నెనెవెంతె నెనెవెనయ్యా
కందా నీనిత్తబా ఎందునీవు నిమ్మదయ
తోరయ్యా చెన్నమల్లికార్జునా ॥ 3

గుంపునుండి విడివడిన ఏనుగు తన వాస స్థానమైన వింధ్యగిరిని స్మరించినట్లు స్మరించెదను. పంజరములో చిక్కిన చిలుక తన బంధువును స్మరించునట్లు స్మరించెదను. మల్లికార్జునదేవా నాపై నీదయజూపి బిడ్డా నీవిటురా అని అనుగ్రహింపుము.

తమ గుంపునుండి వేరైన ప్రాణులు మరల తమ స్వస్థానమును చేరుటకు పరితపించునట్లే జీవుడు భగవంతుని చేరుటకు తపించును.

నెలదమరెయ నిధాన దంతె
ఫలద మరెయ రుచియంతె
శిలెయ మరెయ హేమదంతె
తిలద మరెయ తైలదంతె
మరద మరెయ తేజదంతె
భావద మరెయ బ్రహ్మవాగిప్ప
చెన్నమల్లికార్జునన నిలవారూ అరియబారదు ॥ 4

భూమిలోఉన్న నిక్షేపమువలె, పండులోఉన్న రుచివలె, రాతిలోఉన్న బంగారువలె, నువ్వులలోఉన్న నూనెవలె, చెట్టులోఉన్న అగ్నివలె, భావములో ఉన్న బ్రహ్మమువలె చెన్నమల్లికార్జునుని ఉనికిని ఎవరును తెలిసికొనలేరు.

ఆయావస్తువులలో నిగూఢమైయున్న పదార్థములను వెలికితీయుటకు విశేష ప్రయత్నములు అవసరమైనట్లే దృశ్యప్రపంచము మరుగున భగవంతుని ఉనికిని తెలిసికొనుటకు విశేషసాధన అవసరము. ఆయన దర్శనము సులభసాధ్యము కాదు.



నిన్నరికెయ నరకవే మోక్షనోడయ్యా
నిన్నరియద ముక్తియే నరక కండయ్యా
నీ నొల్లద సుఖవే దుఃఖ కండయ్యా
నీ నొలిద దుఃఖవే పరమసుఖ కండయ్యా
చన్నమల్లికార్జునయ్యా నీకట్టి కెడహిద
బంధనవే నిర్బంధన వెందిప్పను, ॥ 5

నిన్నెరిగిన నరకమే మోక్షము. నిన్నెరుగని మోక్షమే నరకముగదయ్యా! నీకక్కరలేని సుఖమే నాకు దుఃఖము. నీ ప్రీతిని పొందినదుఃఖమే నాకు పరమ సుఖము. మల్లికార్జునస్వామీ నీవుకట్టి పడవేసిన బంధనమే నాకు నిర్బంధనము గదయ్యా.

కర్మ-యోగ, జ్ఞానములవలన ముక్తిలభించవచ్చును. సుఖము లభించ వచ్చును. కాని భక్తునకు భగవంతుని సాక్షాత్కారమే ప్రధానము. అతనికి సుఖ మోక్షాదులు ముఖ్యములుకావు.

—o—

## 3. షట్పది కావ్యములు

కన్నడసాహిత్య వాహిని 12శతాబ్దినుండి తన మార్గపద్ధతిని వదలి దేశి మార్గమును పట్టెను. ఈ మార్గ ప్రాముఖ్యమును లోకమునకు చాటిన విప్లవ కారుడు బసవేశ్వరుడు. తరువాత ఆమార్గమును రసమయమునుచేసి సాహిత్యము నకు సంగీతమును జోడించి పరవళ్ళుత్రొక్కించినవారు హరిహరరాఘవాంకులు. కుమార వ్యాసుడు ఈ మార్గములో ముందుకుసాగి భామిని షట్పది ఛందస్సులో మహాభారత రచన సాగించి కన్నడ సాహిత్యమును లయబద్ధముచేసి నృత్యము చేయించెను.

### కర్ణవిలాపము

కుమారవ్యాస బిరుదముగల గదగునారాయణప్ప 15వ శతాబ్దివాడు. ఆయన "భారతకథామంజరి" అను కన్నడ మహాభారతమున 10 పర్వములు మాత్రము రచించెను. అందలి యుద్ధభూమిలోపడిన కర్ణుడు దుర్యోధనునకై విల పించు ఘట్టము గ్రహించబడినది.

ద్రోణభీష్మర నెచ్చిదరె ముం
గాణికెయలే మడిద రెన్నయ
గోణ కొయ్దను కృష్ణ మున్నిన కులవ నెచ్చరిసి
ప్రాణ పాండవరెంబ నుడియను
జాణనలి హరి ఉలిద నొడయగె
కాణె నా ప్తర నెందు మమ్మల మరగిదను కర్ణ 1

భీష్మని ద్రోణుని నమ్ముకొనగా వారుతొలిచూపులోనే మడిసిరి. కృష్ణుడు నా పూర్వకులమును ఒత్తి చెప్పి నా గొంతుకోసెను. పాండవులు నా ప్రాణతు ల్యులు అని కృష్ణుడు చాల చమత్కారముగ తెలిపెను. ఇంక నాస్వామియగు దుర్యోధనునకు ఆప్తులెవరును కనబడరు అని కర్ణుడు మిక్కిలి విలపించెను.

భీష్మద్రోణులు మహావీరులు- వారి సేనాపతిత్వములలో తప్పక విజయము లభించునని కురుపతి నమ్మెను- కాని వారు మరణించిరి. 18 దినముల భారత యుద్ధములో వీరిద్దరే 15 దినములు యుద్ధముచేసిరి. అయినను ప్రభుపక్షపాతి యగు కర్ణునకు వారు తొలిచూపులోనే పోయినట్లుతోచెను. శ్రీకృష్ణుడు యుదారంభమున వచ్చి తన జనన చరిత్రతెలిపి పాండవులునాకు ప్రాణతుల్యులని చమత్కారముగా నా హృదయమున నాటిపోయెను. అందువల్లనే స్వామినిష్ఠగల తాను సోదరభావముతో పాండవులను చంపలేకపోయియుందునని కర్ణుడు అనుమానించి కృష్ణుడు తనగొంతు కోసెనని ఆక్రోశించుచున్నాడు. తనొక్కడే కురుపతికి ఆప్తుడు. తాను మరణించినతరువాత తన ప్రభువు నిస్సహాయుడగునని కర్ణుడు దుఃఖించెను.

ಕುಲಕೆ ಕೀಳಿವ ನೆಂದು ಟಕ್ಕರಿ
ಗಳೆಯ ಲಾಗಳೆ ಬಂಧುವರ್ಗಕೆ
ಮುಳಿದು ಸಿಂಹಾಸನದಿ ಎನಗಭಿಷೇಕವನು ಮಾಡಿ
ಕುಲದಮಲಿನತೆ ತೊಳೆದು ತನ್ನಯ
ಕುಲದೊಳಗೆ ಬೆಚ್ಚವನಿಪಾಲಕ
ತಿಲಕ ಕುರುಪತಿ ಗಾಪ್ತರಿಲ್ಲೆಂದಳಲಿದನು ಕರ್ಣ॥ 2

కులహీనుడని నీచదృష్టితో చూచినపుడు తన బంధువర్గమును నిరసించి అప్పుడే తనను సింహాసనముపై అభిషేకించి సూతకుల మాలిన్యమును తొలగించి తనకులమున చేర్చికొన్న రాజశ్రేష్ఠుడైన కురుపతికి ఇక ఆప్తులెవరని కర్ణుడు దుఃఖించెను.

కుమారాస్త్ర విద్యాప్రదర్శన సమయమున కర్ణుడువచ్చి తన్ను పరీక్షింప గోరెను. సూతకులజుడుగా లోకమెరిగిన కర్ణుని ద్రోణభీష్మాది గురువృద్ధులు హీనకులజుడని తిరస్కరించిరి. అపుడు దుర్యోధనుడు కర్ణుని అంగరాజుగా చేసి క్షత్రియత్వమునొసగి గౌరవించెను. అట్టి ప్రభువునకు తనవంటి ఆప్తుడు లభింపడు.

నోడి తణియను, నిచ్చలుచితవ
మాడి తణియను, ఖేళ మేళద
లాడి తణియను, శివశివా ఎన్నొడెయ కురురాయ।
నోడ లళిదుదు ద్రోణభీష్మర
గూడి తలెగొళ్ళైసరింతా
మాడితే నరసంగెనుత సలె మరగిదను కర్ణ॥ 3

నన్ను ఎంతచూచినా తనియడు. నాకు నిత్యోపచారము లెన్నిచేసియు తృప్తినొందడు. నాతో ఆటపాటలాడియు తనియడు శివ శివా! నా కురురాజు చూచుచుండగనే ద్రోణభీష్మల శిరములు రాలిపోయినవి. నేనుగూడ తలను సమర్పించుటకంటె నాస్వామికి ఏమిచేసితిని.

పాండవ మహావీరుడైన అర్జునుని కర్ణుడొకడే నిర్జింపగలవాడని దుర్యోధనుడు చాల నమ్మి అతనికి సకల విధోపచారముల సంతృప్తి కలిగించెను. అట్టి కర్ణుడుగూడ ద్రోణభీష్మలవలెనే మరణించుచు ప్రభురుణమును తీర్చుకొనలేక పోయెను.

మొదల లాత్మజ రళివ నొడహు
ట్టిదర మరెయలి మరెద నొడహు
ట్టిదర నూర్వరు మడియె మరెదెను నన్న సుళివినలి।
కదన వెన్నయ సుళియ నొళకొం
డుదు సుయోధన నృపతిగిన్నా
వుదను కాణెను శివశివ! ఎందొరలిదను కర్ణ॥ 4

మొదట తనపుత్రులు చావగా తోబుట్టువులను చూచుకొని ఆ దుఃఖము మరచెను. నూర్గురు తోబుట్టువులుచావగా నన్నుచూచుకొని ఆ దుఃఖమును మరచెను. యుద్ధమిప్పుడు నన్ను కేంద్రముగ చేసికొన్నది. ఈ సమయమున కురుపతికి సహాయకులు లేరే అని కర్ణుడు విలపించెను.

దుర్యోధనుడు పుత్రులు మడసినను, తమ్ములు నాశనమైనను అంతగా విలపింపక కర్ణుడొక్కడున్న విజయము కలుగునను ఆత్మస్థైర్యముతో ఉండెను. కురువీరులందరు గతించిరి. తాను ఏకైకవీరుడుగా పోరాడి మరణించుచున్నాడు ఇక స్వామికి సహాయకులెవ్వరు.

సలహి దొడయన జోళవాళిగె
తలెయ మారువుదొందు పుణ్యద
బెళసు మరణద హొత్తుకృష్ణన కాంబ సుకృతఫల।
ఇళెయొళిందెన గల్ల దారిగె
ఫలిసువుదు నా ధన్య నెనుతెవె
హాళచ దసురాంతకన నీక్షిసుతిద్ద నా కర్ణ॥ 5

పోషించిన ప్రభువుయొక్క అన్నఋణమును తీర్చుకొనుటకు శిరము నర్పించుట ఒక పుణ్యఫలము. మరణ కాలమున శ్రీకృష్ణుని దర్శించుటయు పుణ్యఫలమే. ఇది ఈ జగతిలో మరెవరికి ఫలించును? నేను ధన్యుడనైతిని. అని కర్ణుడు రెప్పవేయక దానవాంతకుని వీక్షించెను.

ఆ కాలమున సైనికులు తమ్ము పోషించిన రాజులకై తమ ప్రాణము లర్పించుటను అన్నఋణమును తీర్చుకొనుటగా భావించి తెగువతో పోరాడు చుండిరి. కర్ణుడట్లే చేసెను. కుమారవ్యాస భారతమందలి కర్ణునకు శ్రీకృష్ణునిపై భగవద్భావన, అపారభక్తి కలవు.

అందు పాశుపతక్కె బళువళి
బందు దంజన బాణవనుదొణె
యింద తెగెదనుగిరిజె యంఘ్రియ నెనెదు మంత్రిసుత।
మందరాచల నడుగె కిడిగళ
సందణియ బాయ్ధాంగెయొంబి నొ
శందు కర్ణన శిరవ నెచ్చను వాసవన సూను॥ 6

అపుడు ఇంద్రపుత్రుడగు అర్జునుడు తనకు బహుమతిగా పాశుపతముతో పాటు లభించిన అంజనాస్త్రమును తూణీరము నుండి తీసెను. పార్వతి పాదము

లను స్మరించి సమంత్రకముగ మందరాచలము కంపించునట్లు, అగ్నిజ్వాలా జిహ్వికలు గల బాణమును ప్రయోగించి కర్ణుని శిరమును గూల్చెను.

పార్థుడు ఇంద్రకీల పర్వతముపై మహేశ్వరుని గూర్చి తపముచేసి మెప్పించి పాశుపతాస్త్రమును బడయుట మహా భారత ప్రసిద్ధము. కుమార వ్యాసుడు పాశుపతముతో బాటు పార్వతి అంజనాస్త్రమును ప్రసాదించినట్లును, దాని చేతనే కర్ణశిరః ఖండనము జరిగినట్లును చెప్పినాడు.

కళచి దుర్యోధనన బెళుగొడె
నెలకె బీళ్వందదలి కౌరవ
కులద నిఖిళైశ్వర్య విళగోర్గుడిసి కెడెదంతె।
ధళధళిప నగెమొగద బిగుహా
క్కళిద హుబ్బిన బిట్టకంగళ
హొళెవ హలుగళ కర్ణశిర కెడెదుదు ధరిత్రియలి॥ 7

దుర్యోధనుని శ్వేతచ్ఛత్రము ఊడిపడినట్లు, కౌరవ కులసకలైశ్వర్యము మొత్తముగా నేల గూలినట్లు, స్వచ్ఛహాసముతో, మిగుల బిగువైన కనుబొమ లతో తెరచిన కనులతో, విచ్చిన దంతపంక్తితో ప్రకాశించు కర్ణుని శిరము నేలరాలెను.

మరణ సమయముతో మహాయోగివలె నిశ్చల మనస్కుడై కర్ణుడు మరణించినట్లు తెలుపుటకై, కవి కర్ణశిరమును ఆ విధముగ వర్ణించెను. కర్ణ మరణముతో దుర్యోధన రాజ్యలక్ష్మి కౌరవుల సమస్త వైభవములు నాశన మయ్యెనని సూచింపబడినది.

---

## హరికథామృత సారము

౹౬వ శతాబ్దిలోని వాదిరాజుని నుండి ప్రాచుర్యమునకు వచ్చిన షట్పదీ కావ్యములు 18వ శతాబ్ది వరకు చాల రచింప బడినవి. ఇది కన్నడ

సాహిత్యమునకు వసంత కాలమన వచ్చును. షట్పది కావ్యములను రెండు విభాగములు చేయవచ్చును. ఒక విభాగము మతధర్మముల ప్రచారమున కుద్దేశించిన పురాణములు, మరొక విభాగము మహాకావ్యములు. షట్పది కావ్యము లలో వైష్ణవ ధర్మప్రచారమునకై విరచింపబడిన హరికథామృత సారము అనర్ఘ రత్నమన దగినది.

18వ శతాబ్దిలో నుండిన మహానుభావులు జగన్నాథదాసులవారు భామినీ షట్పదిలో "హరికథామృత సార" గ్రంథమును రచించిరి. ఇదొక మహత్వ పూర్ణరచన. ఇందలి కరుణా సంధినుండి ఈ పద్యములు గ్రహింపబడినవి.

ధనవ సంరక్షిసువ ఫణి తా
నుణదె మత్తొబ్బరిగె కొడదను
దినది నోడుత సుఖిసువందది లకుమివల్లభను।
ప్రణతరను కాదిహను నిష్కా-
మనది నిత్యానందమయ దు
ర్జనర సేవెయనొల్ల నపుతిమల్ల జగకెల్ల॥ 1

సర్పము ఏ విధముగ భూమిలో నిక్షేపించిన ద్రవ్యమును తాను తినక ఇతరులకు ఈక కాచుకొని చూచుచుండునో అట్లే శ్రీమన్నారాయణుడు తన భక్తులను నిష్కాముడై రక్షించుచుండును. ఆయన నిత్యానందమయుడు. దుష్టుల సేవలను స్వీకరింపడు. జగత్తులో సాటిలేని మేటి మగవాడు.

త్రిమూర్తులలో బ్రహ్మ శంకరులు దురుద్దేశముతో దుర్జనులు తపమాచ రించినను మెచ్చి వరములి రు. విష్ణువు సులభసాధ్యుడు కాడు. తన్ను కొలుచు వారిని అష్టకష్టముల పాల్జేసి చివరకు ఉద్ధరించును. సజ్జనుల రక్షించి దుర్జనుల నాశనము చేయును. సజ్జనులకు భగవత్సేవ నైజమైనట్లే భగవంతునకు భక్త రక్షణము నైజము, నిష్కాములై భగవంతుని సేవించుట మంచిది,

తందె తాయ్గళు తమ్మ శిశువిగె
బంద భయగళ పరిహరిసి నిజ
మందిరది బేకిదుద నిత్తావరిసు వందదలి।

హిందె ముందెడబలది ఒళహొర
గిందిరేశను తన్నవర నెం
దెందు సలహువనాగసద వోలెత్త నోడిదరు॥ 2

తల్లిదండ్రులు తమ బిడ్డలు బైట ఆడుకొనువేళ దుష్టగ్రహములు సోకి భయపడగా ఇంటికి తెచ్చి భయముపోగొట్టి ఇల్లు విడిచి పోకుండ ఎట్లు చూచెదరో అట్లే భగవంతుడు తన భక్తులను సర్వకాలములలో సర్వదేశములలో సంరక్షించుచుండును,

జీవులు భగవంతుని నుండి వెడలి ప్రపంచమునకు వచ్చిన వెంటనే అహంకార మమకారములు సోకి పాపకర్మల నాచరించి భయము పొందుదురు. దైవము అట్టి వారికి జ్ఞానభక్తి వైరాగ్య మంత్రములచే భయముపోగొట్టి లింగ దేహము అను దుష్టస్నేహమును మాన్పి తన లోకమునకు గొనిపోవును.

శ్రవణమనకానంద వీవుదు
భవజనిత దుఃఖగళ కళెవుదు
వివిధభోగ గళిహపరంగళ లిత్తు సలహువుదు।
భువనపావన నెనిప లకుమీ
ధవనమంగళ కథెయ పరమో
త్సవది కివిగొట్టా లిపుదు భూసురరుదినదినది॥ 3

ఈ గ్రంథము వినువారికి ఆనందము కలిగించును. జనన మరణాది దుఃఖములు తొలగించును. ఇహపర సుఖములను, వివిధ భోగముల నొసగును. భువన పావనుడైన లక్ష్మీపతి మంగళకర చరిత్రను పరమోల్లాసముతో ప్రతి దినము చెవి యొగ్గివినని విజ్ఞులుందురా?

వేదోపనిషత్తులను, సంస్కృత పురాణాదులను భక్తితో చదువుపండితులు దేశభాషలో వ్రాయబడినదని దీనిని నిర్లక్ష్యము సేయక భగవంతుని కథాగానమని యైన భక్తితో పఠింపవలెనని కవి భావము.

మళెయనీ రోణియలి పరియలు
బళస రూరొళగిద్ద జనరా
జలవు హెద్దొరె గూడె మజ్జన పాన గైదపరు।
కలుష వచనగళాద రివు బాం
బొళెయ పెత్తన పాదమహిమా
జలధి పొక్కదరింద మాణ్దపరే మహీసురరు॥ 4

వీథిలో పడిన వాననీరు నదులలో చేరి పవిత్రమై స్నానపానాదులకు యోగ్యమైనట్లు నావచనములు క్షుద్రములైనను శ్రీమన్నారాయణుని పాద మహిమా జలధిని చేరి ఉన్నందున విద్వాంసులు నిర్లక్ష్యము చేయరు. ఈ గ్రంథమందలి వచనములలో లోకవార్తల ప్రసక్తి లేక భగవన్మాహాత్మ్య వర్ణన ఉన్నందున విజ్ఞులు గౌరవింతురు.

జననియను కాణదిహ బాలక
నెనె నెనెదు హాలుబుతిరె కత్తలె
మనెయొళడగిద్దవననోడుత నగుత హారుపదలి।
తనయనం బిగిదప్పిరంబిసి
కనలికెయ కళెవంతె మధుసూ
దనను తన్నవరిద్దెడెగె బందొదగి సలహువను॥ 5

చీకటిగదిలో ఉన్న బాలకుడు తల్లిని కానక మాటిమాటికి తలచుకొనుచు వెదకుచున్నపుడు తల్లి వానిని చూచి సంతోషముతో బిగియార కౌగిలించి ఎదకు హత్తుకొని వాని కలవరమును పోగొట్టినట్లు భగవంతుడు తన భక్తులున్న చోటికి వచ్చి వారిని రక్షించును.

— —

## 4. త్రిపది కావ్యములు-సర్వజ్ఞుడు

త్రిపదిచ్ఛందము కన్నడ సాహిత్యమునకు తల్లివేరు వంటిది. ఇది శుద్ధమైన దేశిఛందస్సు. జనసామాన్యుల వాడుకలో ఉండినందుననే శాసనముల కెక్కినది. 7వ శతాబ్దినాటి బాదామి శిలాశాసనమందు త్రిపది కానవచ్చినది. త్రిపదిచ్ఛందములో అనేకులు గ్రంథములు రచించినారు. అవన్నియు మత ప్రచార గ్రంథములు. త్రిపది గ్రంథములలో సర్వజ్ఞుని త్రిపదులు ఉత్కృష్ణమైనవి. అతడు మన వేమనవంటివాడు.

సర్వజ్ఞకవి 16 వ శతాబ్దివాడని అందురు. అతనిని గూర్చి ఏమియు తెలియదు. అతని వచనములు సామాన్యులకు అర్థమగునట్లు సులభముగా ఉండి చిన్నచిన్న మాటలతో విశేషలోకానుభవమును పారమార్థిక విషయమును తెలుపును.

గానవిద్యెయె లేసు మానవతి సతి లేసు
స్వానుభావిగళ కెళె లేసు ఎల్లక్కు
దానియే లేసు సర్వజ్ఞ ॥ 1

సంగీత విద్యయే మంచిది. మానవతి అయిన స్త్రీ ఉత్తమురాలు. స్వానుభవము గలవారి మైత్రి మంచిది. అన్నిటి కంటె దాతయై యుండుట ఉత్తమము.

ఈవంగె దేవంగె అవుదంతరవయ్యా
దేవను జగకె కొడుతిహను కైయారె
ఈవనే దేవ సర్వజ్ఞ ॥ 2

దాతకు దైవమునకు భేదమేమున్నది. దేవుడు జగమునకు ఇచ్చుచుండును. తన చేతులార దానమిచ్చువాడే దేవుడు.

దానదా ఫలదింద భూనాథనాగువను
భానుమండలవ నొడెదమళ స్వర్గక్కె
తానొడెయ నహను సర్వజ్ఞ ॥ 3

దాన ఫలమువలన భూనాథుడు కాగలడు. దానఫలము చేతనే సూర్య మండలమును భేదించి కొనిపోయి ఉత్తమ స్వర్గాధిపతి యగును.

సిరిబంద కాలక్కె కరెదు దానవమాడు
పరిణామవక్కు పదవక్కు కైలాస
నెరెమనెయు అక్కు సర్వజ్ఞ ॥ 4

సిరి వచ్చినపుడు సత్పాత్రులను పిలిచి దానము చేయుము. అది ఫలకారి అగును, పదవి దొరుకును. కైలాసము పొరుగిల్లు కాగలదు.

## 5. సాంగత్య కావ్యములు-హొన్నమ్మ

త్రిపదిచ్ఛందమే కొద్ది మార్పులతో చౌపదిగ మారి సాంగత్యమైనది. శుద్ధకన్నడ ఛందస్సగు 'సాంగత్య' ములో పలువురు కావ్యములు వ్రాసిరి.

### హదిబదెయధర్మవు

17వ శతాబ్దిలో ఉండిన సంచియ హొన్నమ్మ సాంగత్య ఛందస్సులో పతివ్రతా ధర్మముల నెరిగించుటకు ఈ కావ్యమును రచించెను.

తన్న తవరు మనెయవరిత్త పిత్తళె
హొన్నెందు బగెదు పూజిసువ
కన్నెయరొళు కడు కూర్మెయు నొడరిసి
పొన్ను రన్నదొళు పూజిసువుదు ॥

తన పుట్టింటి వారు ప్రీతితో నిచ్చిన ఇత్తడిని బంగారుగా మన్నించు స్త్రీలను మిగుల ప్రీతితో ఆదరించి సువర్ణ రత్నములతో పూజింపఁ లెను.

అన్నపానదొళు ఆభరణ వసన దొళు
మన్నణెయొళు మగవొలిదు
కన్నరన్నెయరు పరకెగెయ్యు లాఃపనె
యున్నతి పడెదిప్పు॥వుదు 2

అన్నపానములలో, వస్త్రభూషణములలో, మానమర్యాదలలో సంతృప్తి చెంది ఏ కన్యారత్నము మనః పూర్వకముగా ఆశీర్వదించుచో ఆ పుట్టిల్లు వృద్ధి పొంది శోభించును.

పెత్త పెణ్ణళ పెర్చిసి మైమరెదు
న్మత్తె యప్పంతె మన్నిసదె
సుత్తు కెలసవ కలిసి గైసువు దొడె
నొత్తి నుడివుదుచితవను ॥ 3

కనిన ఆడుబిడ్డను గొప్పచేసి మైమరపుతో ఉన్మత్తలవలె చరించునట్లు గారాబము సేయక ఇంటి పనులను నేర్పి మంచి మాటలు మదికెక్కునట్లు ఒత్తి చెప్పవలెను.

కనసినొళాదొడ మిదిరు మాతాడదె
కనలదె కలహ వెసగదె
మనెయొళగిరువ మంది గబ్బరి సదె
మన దన్నన మనవొలిసు ॥ 4

కలలో గూడ బదులు చెప్పక, ఆగ్రహింపక, కలహమాడక, ఇంటిలోని వారిపై విసుగు కొనక పతి మనస్సును లోగొనుము.

అత్తె మామందిరి గళుకి యక్కరు గూడి
చిత్త వరితు సేవె యెసగు
అత్తిగె నాదిని యర ననువర్తిసు
పెత్తవరను పెర్మె గొళిసు ॥ 5

అత్తమామలకు భయభక్తులతో వారి మనసు గ్రహించి సేవచేయుము. వదినె మరదండ్రను అనుసరించి వర్తించు, ఇట్లు నడచి కన్నవారి గౌరవము పెంచుము.

—:o:—

## 6. దాస సాహిత్యము-కీర్తనలు

కన్నడ సాహిత్యము సంగీతముతో కలసి కీర్తనల రూపమున అమృత ప్రవాహమును పారించినది. భగవద్భక్తితో ప్రేరితులైన హరిదాసులు జన సామాన్యములో భక్తి బీజములను నాటిరి. ఈ దాససాహిత్యము కీర్తనల రూపమున ప్రవహించి ఆర్తభక్తుల హృదయములను హరిభక్తి సుధతో తనిపినది. గహనములైన శాస్త్ర విషయములను సులభముగ లోకము తెలిసికొన కలిగినది. ఈ దాసులలో పురందర దాసులు సర్వశ్రేష్ఠులు.

## పురందరదాసు కీర్తనలు

శ్రీకృష్ణదేవరాయల గురువులగు వ్యాసరాయ స్వాముల ప్రియశిష్యులగు పురందరదాసులు 16వ శతాబ్దిలో ఉండిన మహానుభావుడు. కర్ణాటక సంగీతమునకు ఆదిపురుషుడు. ఆయన దాసకూటమున కుముఖ్యుడు. భక్తి జ్ఞాన వైరాగ్యములతో నిండిన లక్షలాది కీర్తనలను పురందరదాసులు రచించిరి.

ఈసబేకు ఇద్దు జైసబేకు
హేసిగె సంసారదల్లి ఆశ లేశ మాడద్హాంగె।
తామరస జలదంతె ప్రేమవిట్టు భవదొళు
స్వామిరామ నెనుత పాడి కామిత కైకొంబరెల్ల।
గేరు హణ్ణినల్లి బీజ సేరిదంతె సంసారది
మీరి ఆసె మాడద్హాంగె ధీర కృష్ణ నెనెవ రెల్ల।
మాంస దాశెగె మత్స్యసిలుకి హింసె పట్ట పరియంతె
మోసహోగ ద్హాంగె జగదీశ పురందర విఠల నెన్నుత ॥ 1

అసహ్యకరమైన సంసారము మీద కొంచమైన ఆశ లేకుండా ఈ సాగరమును ఈదవలెను. ఇందులో ఉండి జయింపవలెను. తామరాకుపై నీటిబిందువు వలె జీవితమున ప్రేమతో మెలగుచు రాముని స్మరించుచు కామితములు పడయ

వలెను. జీడిమామిడి (గోడంబి) పండునకు విత్తనము పండులో గాక బయట ఉన్నట్లు సంసారమున చిక్కబడక ఆశలేక కృష్ణుని ధ్యానించవలెను. మాంసము మీద ఆశతో చేపగాలములో చిక్కినట్లు మోసపోక విఠలుని స్మరించుచు సంసార సాగరము నీదవలెను, ఉండి జయింపవలెను.

నా నినగేను బేడువు దిల్ల ఎన్న
హృదయ కమల దొళు నెలసిరు హరియె ॥
శిరనిన్న చరణ కెరగలి, చక్షు
ఎరక దిందలి నిన్న నోడలి, హరియె
నిరుమాల్య నాసఘ్రాణిసలి–ఎన్న
కరణ గీతంగళ కేళలి హరియె ॥
నాలిగె నిన్న కొండాడలి, ఎన్న
తోళు కరంగళ ముగియలి, హరియె
కాలు తీర్థయాత్రెగె పోగలి, మన
ఓ లైపి నిన్నను స్మరిసలి హరియె ॥
చిత్త నిన్నొళు ముళుగాడలి, నిన్న
భక్తజనర సంగ దొరకలి, హరియె
తత్త్వయోగాభ్యాసక్కాగలి, ఉక్తి
సత్యమూరుతి నమ్మపురందర విఠల ॥ 2

శ్రీహరీ! నేను నిన్నేమి వేడను. నా హృదయకమలములో నిలువుము. నా శిరము నీ పాదములను నమస్కరింపనీ, కనులు నిన్నెరిగి దర్శింపనీ, ముక్కు నీ నిర్మాల్యమును మూచూడనీ, నాచెవులు నీగీతములు విననీ, నా జిహ్వ నిన్ను నుతింపనీ, నాచేతులు నీకు మ్రొక్కనీ, పాదములు తీర్థయాత్రకు పోనీ, మనస్సు నిన్ను ప్రీతితో స్మరింపనీ, చిత్తమునీలో మునుకలు వేయనీ, నీ భక్తుల సాంగత్యము దొరకనీ, ఇష్టము యోగాభ్యాసముపై ఉండనీ, సత్యమూర్తి పురందర విఠలా నిన్నేమీ వేడను.

భక్తులు భగవంతుని వాంఛా పూర్తికై వేడుదురు. కాని ఇంతటితోలేదు. దైవము తన హృదయములో నెలకొనవలెనని వేడి ఆయనను పంచజ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ఎట్లు సేవింపవలెనో అర్థించబడినది. పోతన భాగవతములోని 'కమలాక్షునర్చించు కరములు కరములు' అన్న పద్యభాగములు మనకిందు స్ఫురించును.

నిన్నంథ తందె ఎనగుంటు నినగిల్ల
నిన్నంథస్వామి ఎనగుంటు నినగిల్ల
నిన్నంథ దొరె యొబ్బ ఎనగుంటు నినగిల్ల
నీనె పరదేశి నానుస్వదేశి
నిన్న అరసిలక్ష్మి ఎనగె తాయి యుంటు
ఎనగిద్ద తాయ్తందె నినగారయ్యా పురందర విఠల ॥ 3

ఓ విఠలా! నీవంటితండ్రి నాకున్నాడు. నీవంటి యజమాని నాకున్నాడు, నీకులేరు. నీవంటి ప్రభువు నాకున్నాడు నీకులేడు. నీవే పరదేశివి. నేను స్వదేశిని నీరాణి లక్ష్మినాకు తల్లిగా ఉన్నది నాకు ఉన్న తల్లిదండ్రులు నీ కెవరయ్యా? స్వామీ!

బిన్నహకె బాయిల్లవయ్యా
అనంత అపరాధ ఎన్నల్లిఇరలాగి।
శిశుమోహ సతిమోహ జననిజనకర మోహ
రసిక మిత్రర మోహ రాజ మోహ
పశుమోహ భూమోహ బంధువర్గద మోహ
అసురారి నిన్న మరెతెను కాయోహరియె।
అన్నమద అర్థమద అఖిల వైభవదమద
మున్నప్రాయదమదవు రూపమదవు
తన్న సత్వదమద ధాత్రి వశవాదమద
ఇన్నుతనగెదురిల్ల వెందెంబ మదదింద

ఇష్టు దొరకిదరె మత్తిష్టు బేకెంబాసె
అష్టు దొరకిదరు మత్తష్ట రాసె
కష్ట బేడెంబాసె కడుసుఖవ కాంబాసె
నష్టజీవనదాసె పురందర విఠల ॥ 4

స్వామీ! నీకు విన్నవించుటకు నోరులేదయ్యా, లెక్కలేని యపరాధములు నాయందున్నవి. సంతతిపై మోహము, భార్యపైమోహము తల్లిదండ్రుల మీద మోహము, మిత్రులపై మోహము, రాజుపై మోహము, పశుమోహము, భూమోహము, బంధుమోహము వీనితో నిన్నుమరచితిని. తిండిమదము, ధనమదము, వైభవమదము. యౌవనమదము, రూపమదము, బలమదము, అధికారమదము, ఎదురులేనిమదము. నాలో ఉన్నవి. ఇంత లభించిన మరింతకై ఆశ అంతలభించిన ఇంకంతకై ఆశ, కష్టము వద్దను ఆశ. అతిసుఖములకై ఆశ, నష్టజీవితముపైఆశ నాయందున్నవి. నిన్నెట్లు వేడుదును.

తప్పులు చేయుట మానవ సహజము. నిరంతరము తప్పులుచేయుచుండు వారికి దైవమును వేడుటకు సిగ్గుతో నోరుమూతపడును. దైవమును ప్రార్థించు వారిదగ్గర ఎట్టిదోషములు ఉండరాదో ఇందు వివరింపబడినవి.

## కనకదాసు కీర్తనలు

16వ శతాబ్దిలో సేనాపతిగా పేరుపొంది చివరి జీవితములో మహాభక్తుడై తరించిన వాడు కనకదాసు. ఆయన కురుబకులమున జన్మించి నందున సమకాలిక జాత్యహంకారముచే ఈసడింపబడి తన భక్తివైరాగ్యముచే అందరి మన్ననగాంచిన మహాపురుషుడు. ఆయన కీర్తనలు కన్నడ దాససాహిత్యమునకు అలంకారములు.

కుల కుల కుల వెన్నుతిహారు
కుల వ్యావుదు సత్యసుఖవుళ్ళ జనరిగె
కెసరొళు తావరె పుట్టలు అదతందు
బిసజనాభని గర్విస లిల్లవె ॥

హాసువిన మాంస దొళుత్పత్తి క్షీరవ
వసుధె యొళగె భూసుర రుణలిల్లవె ॥
మృగగళ మైయొళ్లి పుట్టిద కస్తూరి
తెగెదు పూసువరు భూసుర రెల్లరు ॥
బగెయింద నారాయణ న్యావకులదవ
అగజెవల్లభ న్యాతర కులదవను ॥
ఆత్మయావకుల జీవయావకుల
తత్త్వేంద్రియగళ కుల పేళిరయ్య
ఆత్మాంతరాత్మనెలె యాదికేశవ
ఆత నొలిద మేలె యాతర కులవయ్యా ॥ 1

కులము కులమని ఎన్నుచుందురు. సత్యసంధులకు జ్ఞానులకు ఏకులమైన నేమి? బురదలో పుట్టిన తామరపువ్వును శ్రీహరికి సమర్పింపరా? పశు మాంస ములో నుండివచ్చిన పాలను బ్రాహ్మణులు త్రాగరా? మృగము దేహమునుండి పుట్టిన కస్తూరిని విప్రులు పూసికొనరా? పుట్టుకతో శ్రీనారాయణునిది ఏకులము. శంకరుడు ఏకులమువాడు. ఆత్మకులమేది. జీవునికులమేది? తత్త్వేంద్రియముల కులములేవి చెప్పరయ్యా! ఆత్మ అంతరాత్మ ఆది కేశవుడే అతను మెచ్చిన వారికి కులముఏల!

లౌకిక జీవనములో ఎన్నో భేదములున్నవి. అన్నీ మానవులేర్పరచు కున్నవి. ఈ అనంతానంత భేదములలో కులభేద మొకటి. మహాజ్ఞానులకు, మహాభక్తులకు సిద్ధపురుషులకు ఏకులమైననేమి? ఏజాతి అయిననేమి!

జపవ మాడిదరేను తపవ మాడిదరేను
కపటగుణ విపరీత విద్దవరు
ఆదిగురు వరియదె అత్తలిత్తలు హారళి
వేద శాస్త్రగళోది బాయారలు
ఆదియను కాణదిందిరుతిద్దు హాలవెంటు
వాద తర్కదొళిద్ద భేదవాదిగళు ॥ 2

కపటగుణము చాల గలవారు, నోరు ఆరునట్లు వేదశాస్త్రములు పఠించి ఆది గురువును ఎరుగక అటు ఇటు పొరలుచుండువారు, అనేక హేతువాదములు తర్కములు వల్లించి మూలమేదో కానివారు ఎన్నిజపములు చేసిననేమి; ఎన్ని తపములు జేసిననేమి అంతయు వ్యర్థము.

మానవుని ఉన్నత స్థితికి కొనిపోవునది అతని సత్ప్రవర్తనము, సుజ్ఞానము. జపతపములు వేదశాస్త్ర పఠనములు తర్కవాదములు ఉన్నతుని జేయలేవు.

## 7. సోమేశ్వర శతకము

17 శతాబ్దిలో నుండిన పులిగెరి సోమనాథుడీ శతకమును రచించెను. కన్నడ శతకములలో ఈ శతకము జనప్రియమైనది. ఈ కవి స్వతంత్రుడు. అపారలోకానుభవము, వివేకము నీతి, కవితా శక్తి గలవాడు. సులభ శైలిలో దీనిని రచించెను.

మ॥ కరెయల్ కర్ణగళిర్దు కేళరు, కరంగళ్ చెల్వనాంతిర్ద్దొడం
ముళిదం తిర్ద్వర మేలె హేరి నడెవర్, మాతిర్ద్దొడం మూకర
ప్పరు, కాలిర్ద్దొడె కుంటరిప్పరిదె కాలం పూర్వ పుణ్యాంగళిం
సిరివంతర్ నెలెగాణరై హరహరా శ్రీచెన్నసోమేశ్వరా॥ 1

చెవులుండియు పిలుపును వినరు, చేతులుబాగుండియు విరిగినట్లు ఇద్దరిపై జేతులుమోపి నడిచెదరు. మాట్లాడింపిన మూగవారివలె బదులు పలుకరు, కాళ్ళుండియు కుంటెదరు, పూర్వపుణ్యము వలన శ్రీమంతులైనవారు నేలను జూడరు.

ధనవంతులు వివేకము గోల్పోయి గర్వాంధులై ఎట్లుచరింతురో ఇందు చక్కగా నిరూపింపబడినది.

మ॥ బరె దారిద్ర్యది ద్రోణనం ద్రుపద పూర్వస్నేహదిం కండనే,
కురుభూపాలను పాండుపుత్రరు మహాధర్మాత్మరెం ది త్తనే,
హరియం తంగియబాలనెందు బగెదేం కంసాసురం కండనే,
దొరెగగ్గళత్తణ నంటరె హరహరా శ్రీచెన్నసోమేశ్వరా॥ 2

ద్రుపదరాజు దరిద్రుడైన ద్రోణాచార్యుని పూర్వస్నేహముతో చూచెనా? దుర్యోధనుడు ధర్మాత్ములైన పాండవులకు భాగమిచ్చెనా? కంసుడు తన చెల్లెలి కొడుకని కృష్ణుని ప్రేమించెనా? రాజ్యమదమత్తులు బాంధవ్యము గణింతురా?

మదాంధులైన రాజులు మైత్రిని బాంధవ్యమును ఆత్మీయతను గమనింపరు. తమ స్వార్థమునకై ఎట్టి అకృత్యములకైన పాల్పడుదురు.

మ॥ కవియే సర్వరొళుత్తమం కనకవే లోహంగళొళ్ శ్రేష్ఠ,జా
హ్నవియే తీర్థదొళున్నతం, గరతియే స్త్రీజాతియొళ్ వెగ్గళం
రవిముఖ్యం గ్రహవర్గదొళ్, రసగళొళ్ శృంగారవేబల్మె, కేళ్
శివనే దేవరొళుత్తమం హరహరా శ్రీచెన్నసోమేశ్వరా॥ 3

కవియే అందరిలో ఉత్తముడు, లోహములలో బంగారమే శ్రేష్ఠము. తీర్థములలో గంగానదియే శ్రేష్ఠము. పతివ్రతయే స్త్రీలలో ఉత్తమురాలు, గ్రహములలో సూర్యుడే ముఖ్యుడు. నవరసములలో శృంగారమే ఉత్తమము, దైవములలో శివుడే శ్రేష్ఠుడు.

ఉడురాజం కళెగుంది పెర్చదిహనే, న్యగ్రోధబీజం కెలం
సిపిదుం పెర్మరవాగదే ఎళగరుం ఎత్తాగదే, లోకదొళ్
మిడి పణ్ణాగదె, దేవరొల్మెయుదిరల్ కాలానుకాలక్కె వేళ్
బడవం బల్లిదనాగనే, హరహరా శ్రీచెన్నసోమేశ్వరా॥ 4

చంద్రుడు కళాహీనుడై మరల వికాసము పొందడా? చిన్నదగు మఱ్ఱి విత్తనము పగిలి పెనుమ్రానుకాదా? లేదూడ ఎద్దుకాదా? పిందెపండుకాదా? దైవానుగ్రహమున్నచో ఏ కాలమునకైన బడుగువాడు బల్లిదుడుకాదా?

మ॥ రవి యాకాశకె భూషణం, రజనిగం చంద్రం మహాభూషణం,
కువరం వంశకె భూషణం, సరసిగంభోజాతగళ్ భూషణం
హవియజ్ఞాళిగె భూషణం, సతిగె పాతివ్రత్యవే భూషణం,
కవి ఆస్థానకె భూషణం హరహరా శ్రీచెన్నసోమేశ్వరా ॥ 5

ఆకాశమునకు సూర్యుడు అలంకారము, రాత్రికి చంద్రుడు మహాభూషణము. కుమారుడు వంశమునకు భూషణము. సరస్సుకు కమలములే భూషణము. యజ్ఞములకు హవిస్సే భూషణము. స్త్రీలకు పాతివ్రత్యమే అలంకారము. రాజాస్థానమునకు కవియే అలంకారము.

—;o;—

# కన్నడ సాహిత్య సౌరభం

గడియారం రామకృష్ణశర్మ

